# యామయ్య సామి గుర్రం

పక్కూర్లోకి యామయ్యసామి గుర్రం వచ్చిందని మా ఊరి పెద్దలకి తెలియంగానే అందరూ రచ్చబండ వద్ద సమావేశం అయ్యారు. ఎట్టైనా గానీ ఈసారి యామయ్య సామిని మనూరికి పిల్చుకరావాలి. అందుకు అందరూ చందాలివ్వాలని గ్రామపెద్ద పెద్దిరెడ్డి చెప్పాడు. యామయ్య సామి గుర్రం ప్రదర్శనలు చేస్తే వర్షాలొస్తాయని, పైర్లు పచ్చగా వుంటాయని ప్రజలందరి విశ్వాసం.

***

తెల్లారాక గ్రామపెద్దతో పాటు మరో ఇరవై మంది పక్కూరికి వెళ్ళి యామయ్య సామిని కలిశారు. మా ఊరికి రావాలని ఆహ్వానించి వసూలైన నగదు ఆయన ముందుంచారు. సామి ఒప్పుకున్నాడు. తెల్లారేపాటికి మీ ఊర్లో వుంటానని చెప్పాడు. ఈ సంగతి తెలిసిన మా ఊర్లో ప్రజలకి కాళ్ళు చేతులు ఆడలేదు. ఎక్కడ పని అక్కడ వదలి గోడలకు సున్నాలు పూశారు. పానకం, వడపప్పు, పాయసం.. ఎన్నెన్నో చేసుకున్నారు. రాత్రికి రాత్రి ఊరు ఊరంతా ఉత్సవంలా తయారయ్యింది. ఎటుచూసినా మామిడి తోరణాలు.. రంగు కాగితాలతో గ్రామం శోభిల్లింది.

***

తెల్లారిందగ్గర్నుంచి నుంచి 'ఇంకొస్తాడు.. ఇంకొస్తాడు' అని ఊరంతా యామయ్య సామికోసం ఎదురు చూస్తున్నారు. "ఇంకారాల.. ఇంకారాల" జనం మాత్రం చుట్టుకున్నారు. ఎంత జనం! ఎంతజనం!! అందరూ రోడ్డువైపే

చూస్తున్నారు. కనుచూపు మేరలో సామి అలికిడి లేదు.

యామయ్యసామి వస్తాడా? లేదా?

కాలం కరుగుతూనే వుంది. జనంలో కొంత మంది వుండబట్టలేక 'యామయ్య సామికి' ఇచ్చిన డబ్బు సరిపోయిందో లేదో ననుకుంటున్నారు. ఇంకొంతమంది 'సామేంది మనూరు రావడం ఏంది' అని గొణుక్కున్నారు. చెట్లెక్కిన పిల్లలు ఆమడ దూరంలో వస్తున్న గుర్రాన్ని చూసి 'సామొస్తున్నాడు.. సామొస్తున్నాడు' అని అరిచారు. జనమంతా ఉప్పెనైరి. ఒకరినొకరు రాసుకుంటూ రోడ్డువైపు ఎగబడ్డారు. తప్పెట్లు మోగుతున్నాయి. కొమ్ములు ఊదుతున్నారు. నాకైతే ఊపిరాడడం లేదు. యామయ్యసామి వచ్చాడు. అందరి కళ్ళుసామివైపే వున్నాయి. పసుపురంగు వస్త్రాలు ధరించి నెత్తికి పెద్ద తలపాగ చుట్టుకున్న నిలువెత్తు రూపం. యామయ్య గుర్రంపై కూర్చుని వున్నాడు. పిల్లల సంబరం చెప్పనలివి కాలేదు. ఆలస్యమైనందుకు మన్నించాలని.. ఈ ఊర్లో ఇంత మంది జనాన్ని చూస్తుంటే సంబరంగా వుందని వెంటనే ప్రదర్శన ప్రారంభిస్తానని సామి చెప్పాడు. అందరి ఆనందం అంబరాన్ని తాకింది. తప్పెట్లు.. కొమ్ములు.. మోగుతూనే వున్నాయి.

"ఈ ఇసుకలో వేసిన రూపాయి నాణేన్ని గుర్రం మీద జర్రున పోతూనే అందుకుంటా చూడండి" చెప్పాడు యామయ్యసామి. నాకేం అంతుబట్టలేదు. అంతపెద్ద గుర్రంపైనుంచి జుమ్మని పోతూ వంగి చేయిని భూమికి తాకించడమే ఎంతో కష్టం. ఇక నాణేన్ని సామి ఎట్లా అందుకోగలడు? సామి చాలా దూరం గుర్రంతో మైదానంలో దౌడు తీశాడు. నాణేన్ని ఇసుకలో నిలబెట్టారు. సామి గుర్రం మీద జర్రున వస్తున్నాడు.. వస్తున్నాడు.. గుర్రం కాళ్ళకింద ఇసుక మూరెడెత్తు అలా ఎగిసి పడుతోంది. మరోవైపు ఉధృతంగా ఎదురుగాలి.. దుమ్మురేగుతోంది. సామి దూసుకొస్తున్నాడు. వస్తున్నాడు.. దగ్గరికొస్తున్నాడు.. గుర్రపు పగ్గాలు ఒక చేత్తో వున్నాయి. మరో చేయితో భూమిని తాకాడు. జానెడెత్తు ఇసుక లేచింది. చేతిలో నాణెం పడింది. అంతా క్షణాల్లో జరిగిపోయింది. నాకైతే వరాలు బిగుసుకుపోయాయి. ఎంత నేర్పు? గుర్రం ఏమాత్రం పట్టుతప్పినా సామికి మూతి పళ్ళుండవు. సామి సామాన్యుడు కాదు. తప్పెట్లు మోగుతున్నాయి. టెంకాయలు పగిలాయి. హారతిచ్చారు. స్వామికి దండవేశారు. సామి ఇంకేం విద్యలు చేస్తాడో చూడాలని నాకు ఆసక్తి పెరిగిపోయింది.

***

"ఇప్పుడు ఈ అడ్డం పాతిన పదైదు అడుగుల ఎత్తుగల వెదురు బొంగును నా గుర్రంతో ఎగిరిస్తా చూడండి" చెప్పాడు సామి.

నాకైతే మళ్ళీ ఏం అర్థం కాలేదు. నా ఎత్తుకే రెండింతలు ఎత్తున్న ఆ వెదురు బొంగు అడ్డాన్ని సామి గుర్రంతో ఎట్లా ఎగిరించగలడు?

సామి గుర్రాన్ని మైదానం చుట్టూ పరిగెత్తిస్తున్నాడు. గుర్రం బాగా దౌడు తీస్తోంది. వేగం పుంజుకుంది. వస్తోంది.. వస్తోంది.. మూరెడు దూరంలో వుండగానే ఎగిరింది. ఆకాశంలోకి దూకింది. అందరి కళ్ళు ఆకాశంలోకి చూస్తున్నాయి. అంతే! అంత ఎత్తు అడ్డమున్న వెదురు బొంగును ఒక్క ఉదుటున గుర్రం ఎగిరింది. అందరూ ఊపిరి పీల్చుకున్నారు. సామి ఎట్లా ఎగిరిచ్చాడు? గుర్రం గిట్టయినా పొరపాటున వెదురుకు తగిలితే సామికి కాళ్ళు చేతులుండవు. ఎంత బాగా ఎగిరిచ్చాడు. తప్పెట్లు మోగుతున్నాయి. మళ్ళీ హారతులు..టెంకాయలు దండలు.. ఒక్కొక్కటిగా జరిగిపోతున్నాయి.

రచ్చబండ పైకెక్కి పెద్దిరెడ్డి " ఇవాళ ఆకాశంలో మేఘాలు కమ్ముకున్నాయి. కాబట్టి ఇక చాలు. మళ్ళీ ప్రదర్శనలు రేపు వుంటాయి" అని చెప్పాడు.

మావి ఎడారి నేలలు. ఆకాశం నుంచి చినుకు రాలడమంటే మాటలు కాదు. గగనం. ఎన్నెన్ని దేవుళ్ళకు మొక్కుకోవాలో? ఎన్నెన్ని జీవాల తలలు సమర్పించుకోవాలో? అయినా చినుకు రాలిందేది? వంటిమీద పడ్డ చినుకులు ముత్యాల్లా మెరుస్తున్నాయి. యామయ్య సామి ప్రదర్శనలు కరుడుగట్టిన మేఘాల హృదయాన్ని సైతం కరిగించినట్టు అనిపిస్తోంది. ఒకదాని వెనుక ఒక చినుకు నన్ను తడిమేస్తున్నాయి. ఈ చినుకులతో పాటుగా నేనుకూడా ఓ చినుకై ఈ భూమి అంతర్గతంలో ఇమిడిపోవాలని వుంది.

***

చీకటి పడింది. యామయ్య సామి ఎక్కడికెళ్ళి వుంటాడు? పెద్దిరెడ్డి తన ఇంటికి తీసుకెళ్ళాడని తెలిసింది. సామి ఇప్పుడేం చేస్తున్నాడో చూడాలని వుంది. మెల్లిగా వెళ్ళి నా మిత్రుడు అంజిని వెంటేసుకున్నాను. "రేయ్! సామి విద్యలన్నీ గుర్రంలో నున్నాయా? మనిషి దగ్గరున్నాయా? చూద్దామా" అని వాడికి గిలి పుట్టించాను. ఇలాంటి వంటే వాడికి చాలా ఇష్టం. 'సరే' అన్నాడు. ఇద్దరం కలిసి పెద్దిరెడ్డి ఇంటికెళ్ళాం. బయట వరండాలో గుర్రం వుంది. వాడు గుర్రాన్ని చూడగానే "రేయ్! గుర్రం ఎంత పెద్దదో చూడు. దీని మీద ఎవరెక్కినా ఆ వింతలన్నీ చేస్తుంది" అన్నాడు.

నన్ను కూడా గుర్రమెక్కమన్నాడు. చుట్టూ చూశా. ఎవరూ లేరు. చిన్నగా దాని దగ్గరికి వెళ్ళాను. ఎట్లా కొట్టిందో అర్థం కాలేదు కానీ ఎగిరొచ్చి అంజిగాడి దగ్గర పడ్డాను. కళ్ళు బైర్లు కమ్మాయి. గుర్రంలో ఏమీ లేదని.. మహిమంతా మనిషి

దగ్గరే వుందని అర్థమైంది. అక్కడినుంచి వెంటనే ఇంటికొచ్చాం. వర్షం కురుస్తానేవుంది.

***

తెల్లారింది. రాత్రంతా బీభత్సంగా కురిసిన ఆకాశం తనకు ఏమీ తెలియనట్టుగా నిశ్శబ్దంగా వుంది. రచ్చబండ మైదానంలో ఇరవై అయిదు అడుగుల పొడవుగల గుంతను తీశారు. దాన్ని నరక్కొచ్చిన తాటి మొన్లతో నింపారు. మంట పెట్టారు. పొగలేసింది. సెగబెట్టింది. ఎర్రటి గులాబీల్లా నిప్పులు మెరుస్తున్నాయి. జనమంతా గుమిగూడారు. " ఈ అగ్నిగుండం ఎందుకు?" అని అడిగాను అక్కడున్న ఒకతన్ని. "యామయ్యసామి దీన్ని ఎగిరిస్తాడంట" చెప్పాడతను.

నా గుండెలు గుభేల్మన్నాయి. ఇంత పెద్ద అగ్నిగుండాన్ని గుఱ్ఱం ఎగదరం సాధ్యమా? నిప్పుల సెగకు తట్టుకోలేక అక్కడున్న వాళ్ళు దూరంగా జరిగిపోతున్నారు. అలాంటిది ఆ నిప్పుల మీదుగా ఎగరడం? సామిదగ్గర మంత్రాలేమైనా వున్నాయా? లేకుంటే కళ్ళకు కనికట్టు కట్టి విద్యలు చూపే రకమా? నాకేం అర్థం కాలేదు. పెద్దిరెడ్డి సామిని తీసుకొచ్చాడు. సామి గుఱ్ఱమెక్కాడు. గుండం దాటడానికి సిద్ధమైనాడు. అందరూ నివ్వెరబోయి చూస్తున్నారు.

గుఱ్ఱం దౌడు తీస్తోంది. దూసుకొస్తోంది. గుండం దగ్గర ఎగిరింది. చంగున అటువైపుకు దాటుకుంది. అంతా క్షణాల్లో జరిగిపోయింది. నేను గుండెలపై నుంచి చేతులు తీసుకున్నాను. నుదుటి చెమట తుడుచుకున్నాను. చప్పట్లు మోగుతున్నాయి. మైదానమంతా మార్మోగుతోంది. సామి అందరూ చూస్తుండగానే అంత పెద్ద నిప్పుల కుంపటిని ఎంత చాకచక్యంగా ఎగిరించాడనిపిస్తోంది.

సామి గుఱ్ఱం దిగి నీళ్ళు తాగాడు.

"ఏం పెద్దిరెడ్డి ఇంకా ఏం చెయ్యాలో చెప్పు?" అడిగాడు యామయ్యసామి.

"చాల్లే సామి. నిన్నటి నుండి చేస్తూనే వున్నారుగా" అన్నాడు పెద్దిరెడ్డి.

"అట్లేం అనుకోకు. ఏదైనా వుంటే సెప్పు" సామి మళ్ళీ అడిగాడు గంభీరంగా.

"సరే సామి మీరంతగా అడుగుతున్నారు కాబట్టి చెప్తున్నాను. ఏటిగట్టున వున్న 'పాత రాళ్ళ బావి ఎగిరించండి" అన్నాడు పెద్దిరెడ్డి.

సామి చిన్నగా నవ్వుతూ 'సరే' అన్నాడు.

జనమంతా ఏటిగట్టునున్న పాతరాళ్ళ బావి దగ్గరకు వెళ్ళాల్సిందిగా పెద్దిరెడ్డి చెప్పాడు.

జనమంతా ఉరుకులు పరుగులు పెడుతున్నారు.

నాకేం అర్థం కాలేదు. పాత రాళ్ళబావి అంటే ఆషామాషి కాదు.

సామి ఇంతకు ముందు ఎగిరిన అగ్నిగుండం కంటే పొడవైంది. వెదురు బొంగు కంటే ఎత్తయినది. రాళ్ళబావి రెండు ఇసుక దిబ్బల మధ్యన ఉంది. నేను పుట్టినప్పటి నుండి ఆ బావిలో నీళ్ళు చూల్లేదు. బావి నిండాకు బండరాల్లే వుంటాయి. ఇసుక దిబ్బలు, ఏటిగట్టు మొత్తం జనంతో నిండిపోయాయి. సామి అక్కడికి రాగానే బావి గట్టుకొచ్చి చూశాడు.

ముఖంలో ఏదో అనుమానం. అస్పష్ట భావం.

సామికి ఏమీ బోధపడనట్టు అయింది.

"ఏం సామి బావి ఎట్లుంది?" అడిగాడు పెద్దిరెడ్డి.

సామి ఏం చెప్పకుండా గుర్రమెక్కాడు.

జనం ఆనందానికి అంతులేదు. గాలికి ఏట్లోని ఇసుకంతా సుడులు తిరుగుతోంది. సామి గుర్రాన్ని దౌడు తీయిస్తున్నాడు. గుర్రం ఎగిరెగిరి పడుతోంది. తప్పెట్లు జోరుగా మోగుతున్నాయి. నా గుండె శబ్దం నాకు వినపడుతోంది. నరాలన్ని బిగిసుకుపోయాయి. సామి గుర్రం దౌడు తీస్తోంది. వస్తోంది.. వస్తోంది.. బావి దగ్గరికి రాగానే చెంగున ఎగిరింది. సామి చేతుల్లోని పగ్గాలు తెగాయి. గుర్రం గట్టున నిలబడింది. సామి పట్టుజారింది. ఊహించని రీతిలో సామి బావిలో పడ్డాడు. నా మెదడు మొద్దుబారిపోయింది.

"రేయ్! సామి బావిలో పడ్డాడు. చూడండి" తన మనుషులతో పెద్దిరెడ్డి అన్నాడు.

బావిచుట్టూ జనం అల్లుకుపోయారు. రాళ్ళల్లో.. అంత లోతులో సామి బొక్కబోర్లాపడి వున్నాడు.

సామీ.. సామీ.. సామీ అందరూ గట్టిగా పిలుస్తున్నారు. కానీ సామికి చలనం లేదు. గట్టుమీది గుర్రం సకిలించింది. ఆకాశం మబ్బుల్ని కరిగించడానికి సిద్ధమైంది. హోరున గాలి ప్రజ్వరిల్లింది. వర్షం మొదలైంది.

పెద్దిరెడ్డి మనుషులు నలుగురు తాళ్ళు కట్టుకుని బావిలోకి దిగారు.

" ఏమైందిరా?" గట్టుమీద నుండి పెద్దిరెడ్డి అడిగాడు.

"సామి చచ్చాడు" బావిలోని వాళ్ళు గట్టిగా అన్నారు.

"సామి చచ్చిపోయాడంట. సామి చచ్చిపోయాడంట" వర్షాన్ని ఎవరూ పట్టించుకోవడం లేదు. అందరూ తడిసి ముద్దయిపోతున్నారు.

సామి శవాన్ని రచ్చబండ దగ్గరికి తెచ్చారు.

కడుపులో అవతలి నుంచి ఇవతలకు పొడుచుకొచ్చిన బండరాయి ఎర్రరక్తంతో తడిసిపోయింది.

గుర్రం ఏమీ ఎరగనట్టు ఆ ప్రక్క పచ్చగడ్డి తింటోంది.

వర్షం మరింత ఉధృతమైంది.

"ఈ గుర్రమే సామిని బలితీసుకుంది. దీన్ని చంపాలి" అని గుంపులో ఎవరో అన్నారు.

పెద్దిరెడ్డి వాళ్ళను సముదాయిస్తూ.. "సామికి రాత్రే చెప్పినా. ఆ పగ్గాలు పాతవి య్యాయి. తీసేసుకో. కొత్తవి వేసుకోమని నగదు కూడా ఇచ్చిన. కానీ వినలేదు. లోగా దారుణం జరిగిపోయింది" కన్నీళ్ళు తుడుచుకుంటూ అన్నాడు పెద్దిరెడ్డి.

సామి చేతుల్లో పగ్గాలు ఇంకా అలాగే వున్నాయి. పాపం! ఎంత గట్టిగా పట్టుకుని న్నాడో.

"సామిని బావి దగ్గరే సమాధి చేసి ఓ గుడి కట్టించాలని" పెద్దిరెడ్డి అన్నాడు. సామి శవం కోసం గుంత తవ్వుతున్నారు. మరో పక్క గుంతలోకి వర్షపు నీళ్ళు జేరుకుంటున్నాయి. శవం మీద పడ్డ చినుకులు ఎర్రరంగు కప్పుకుని బయటకొస్తున్నాయి.

"తీసిన గుంత చాలు.. వర్షం ఎక్కువైంది. సామిని పడుకోబెట్టండండి" కేకవేశాడు పెద్దిరెడ్డి.

అట్లే గుంతలోకి శవాన్ని వేసి మట్టి కప్పారు.

"పదండీ వర్షం తగ్గిన తరువాత వద్దాం" అంటూ ఎవరి దోవన వారు పరుగుపెట్టారు.

అందరం వెళ్ళిపోయాం. వారం రోజుల పాటు కుంభవృష్టి. ఎవరూ గడపలు దాటలేదు.

***

వర్షాలు తగ్గాయి. చిన్నగా ఎండరావడం మొదలైంది.

అందరూ పొలాలు దున్నుకోవాలని సిద్ధమవుతున్నారు. పెద్దిరెడ్డి రాళ్ళబావి దగ్గర సామి గుడికట్టిస్తున్నాడు. ఇంతలో అంజిగాడు "రే రే! మీ కల్లం కాడ సామి గుర్రం వుంద"ని చెప్పాడు.

నా ఆనందానికి పగ్గాల్లేవు. పరిగెడుతూ పరిగెడుతూ కల్లం దగ్గరకి వెళ్ళి చూశా. అరవాము గడ్డిలేదు. కానీ గుర్రం వుంది. అంటే ఇన్నిరోజులు అది అక్కడే వుందన్న మాట. వానకు బాగా తడవడం వల్ల తెల్లగా మెరుస్తోంది.

చిన్నగా చిటికెన వేలితో దాన్ని దూరం నుండే తడిమాను. ఏం అన్లేదు. అప్పుడు పెద్దిరెడ్డి గారింటిలో తన్నిందిగా ఆ భయం నాలో ఇంకా వుంది. ఈసారి దాని ముఖం ముందుకొచ్చి రెండు చేతులతో నిమిరాను. దాని కంటి దగ్గర ఆరని తడి వెచ్చగా తగిలింది. నాలికతో నా చేయి నాకుతోంది. నాకు ఎగిరి

గంతేయాలనిపించింది. ఇక ఏమాత్రం ఆలశ్యం చేయకుండా పెద్దిరెడ్డిని కలిసి నేను ఆ గుర్రాన్ని తీసుకుంటానని చెప్పాను. "దాన్నేం చేసుకుంటావురా?" అని అంటూనే అనుమానంగా చూశాడు పెద్దిరెడ్డి.

నాకు ఆ గుర్రం కావాల్సిందేనని మంకుపట్టు పట్టాను.

"సరే సామికి కట్టే గుడికి డబ్బు ఇవ్వాలి? సరేనా" అన్నాడు పెద్దిరెడ్డి.

"ఇస్తాను" అన్నాను.

"అయితే దానిని వుంచేసుకో" అన్నాడు పెద్దిరెడ్డి.

మా మామతో చెప్పి పెద్దిరెడ్డికి డబ్బు ఇప్పించాను.

గుర్రం కల్లం దగ్గరే వుంది. రోజూ పోయి చూసి వస్తున్నాను. మాకు ఇది వరకే ఒంటెద్దు బండి వుంది. దాని ఎద్దును పొలం దగ్గరికి పంపి.. గుర్రాన్ని బండికి కట్టాను.

ఎప్పుడు పొలం దగ్గరికి పోవాలన్నా పట్నానికి వెళ్ళాలన్నా ఈ బండిలోనే వెళ్తున్నాం. ఊళ్ళో వాళ్ళందరూ మా బండిని చూస్తే చాలు.. అదిగో 'యామయ్య సామి బండి' అని అంటున్నారు.

పట్నానికి గానీ, పొలానికి గానీ వెళ్ళాలంటే రాళ్ళ బావి దగ్గరి నుండే వెళ్లాలి. రాళ్ళ బావిని సమీపించిన ప్రతిసారీ నాకు ఆరోజు సామి బావిని చూసి ముఖం చిట్లించుకున్న దృశ్యమే గుర్తొస్తుంది. గుండె బరువెక్కుతుంది. చెంగున దూకే గుర్రం కూడా ఆ చోటుకు రాగానే వేగం మందగించి టన్నుల బరువు మోస్తున్నంత భారంగా కదులుతుంది.

1997 జులై 6

ఆంధ్రజ్యోతి ఆదివారం అనుబంధం

డా॥ వేంపల్లి గంగాధర్ : 'రాష్ట్రపతి భవన్'లో విశిష్ట ఆతిథ్యం అందుకున్న తొలి భారతీయ సాహితీవేత్తగా వీరు గుర్తింపు పొందారు. 2014, సెప్టెంబర్ 8వ తేదీ నుంచి 26 వరకు వీరు రాష్ట్రపతి భవన్‌లో విడిది చేశారు. రాయలసీమ ప్రాంతానికి సంబంధించిన పలు అంశాలపై పుస్తకాలు రాశారు. వీరి కథా సంకలనం 'మొలకల పున్నమి'కి కేంద్ర సాహిత్య అకాడమి మొదటి యువపురస్కారం - 2011 లభించింది. ప్రసిద్ధ సాహితీవేత్త సునీల్ గంగోపాధ్యాయ చేతుల మీదుగా తామ్రపత్రం అందుకున్నారు. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం నుంచి 'రాయలసీమ కథా సాహిత్యం' పై పిహెచ్‌డి, 'రాయలసీమ ఫ్యాక్షనిజం' పై ఎంఫిల్ పూర్తి చేశారు. కేంద్ర ప్రభుత్వం వారి 'రైటర్స్ ట్రావెల్ గ్రాంట్' ద్వారా 'శాంతినికేతన్'లో పర్యటించారు. మొలకల పున్నమి, దేవరశిల, గ్రీష్మభూమి, తొలితెలుగు శాసనం, పూణే ప్రయాణం, కథనం, హిరణ్యరాజ్యం, నేలదిగినవాన, నేను చూసిన శాంతినికేతన్, పాపాఘ్ని కథలు, రావణవాహణం కథలు, కడప వైభవం (సంపాదకత్వం), అనంతపురం చరిత్ర (సంపాదకత్వం), ఎర్రచందనం దారిలో తమిళ కూలీలు, యురేనియంపల్లె నవల పుస్తకాలు రాశారు. సీమ గిరిజన తండాల నుంచి పడుపు వృత్తిలోకి తరలిపోతున్న మహిళల జీవన ఆక్రందనను 'పూణే ప్రయాణం' రచనలో చిత్రణ చేశారు. ఇదే ఇతివృత్తంతో రాసిన 'మైనం బొమ్మలు' కథకు అమెరికన్ తెలుగు అసోసియేషన్ (ఆటా) పురస్కారం దక్కింది. న్యూఢిల్లీ కథా ఫౌండేషన్‌వారి నుంచి 'శిలబండి' కథకు జాతీయ కథాపురస్కారం, 'నేలదిగిన వాన' నవలకు అంపశయ్య నవీన్ సాహితీ పురస్కారం, 'దేవరశిల'కు రావూరి భరద్వాజ స్మారక సాహితీ పురస్కారం అందుకున్నారు. వీరి కథలు పలు భారతీయ భాషలలోకి అనువాదమయ్యాయి.




Dr.Vempalli Gangadhar of Kadapa receiving sahitya Akademi Yuva Puraskar
from Akademi president Sunil Gangopadhyay . (25th August 2012, Bhubaneswar (Odisha).

# యామయ్యసామి గుర్రం

డాక్టర్ వేంపల్లి గంగాధర్



కథ